లవ॥ అన్నా ! రాముఁడెవఁడు? తాటకయను స్త్రీనిజంపిన వీరుఁడా? అయ్యా! నీవారాముని సేమికావలయు? కుమారుఁడవా? తమ్ముఁడవా? బంటువా?

లక్ష్మణ॥ సీ॥ తాటకమర్దించి తెపసియాగముఁగాచె
శ్రీరామునెఱుఁగరే శిశువులార?

లవ॥ ఆఁడుదానిని జంపినట్టి మీరాముని
నెఱుఁగమే యతఁడొక్క వీరుఁడౌనె?

లక్ష్మణ॥ వాలినినొకకోలఁ గూలనేసినరాము
బలమును దెలియరో బాలులార?

కుశ॥ చెట్టుచాటునదాగి చేరికొతినిజంపు
ధీరుని మీరాముఁ దెలియలేమె?

లక్ష్మణ॥ మాయామృగంబైన మారీచునటుఁజంపె
వరరాము నెఱుఁగరో బాపలార?

లవ॥ చేరిన బరుగెత్తు జింకపిల్లనుజంపు
శ్రీరాము నీవింత చెప్పనగునె?

లక్ష్మణ॥ వరలోకవీరుఁడౌ పరశురామునినోర్చు
ఘనురాము మీరేమి వినఁగలేదె?

కుశ॥ బడుగుబాపని భంగపఱచుటబ్బురమౌనె
సిగ్గుచేటుగ మాకుఁజెప్పనేఁ?

లక్ష్మణ॥ గీ॥ త్రాహియని భక్తివేఁడఁడా రావణుభ్రుని
పరగరక్షించు యుద్ధంబు వలదువలదు

లవ॥ పాహియంచని రాముండు వచ్చెనేని
హయమునిత్తుము మరిమాటలాడవలదు॥

లక్ష్మణ॥ బాలకులారా! పశివారుకావున తెలియక రాముని నిందించినను సూరకుండవలసివచ్చెను. ఇంక మితిమీరిన నీ లక్ష్మణుని క్షమా గుణము మిమ్ముంగాపాడునని తలంపకుండుం.

లవ॥ నిలువుము. నిలువుము ఏ వేనా లక్ష్మణుండవు? కాదయ్యా నీపేరునకు పూర్వాపర బిరుదపదములు లేవా? అవనీధవ లక్ష్మణుండవా? భూపతి లక్ష్మణుండవా?

కుశ॥ కాదురా. "అవనీధవ" యనుచోట "నీధవ" అనునది తీసివేయుము. ఇతని కదియేచాలును. అయ్యా! నీసంగతి మాకు తెలియును. నీపరాక్రమము మేమును కొంచెము వినియున్నాము. నీవా యింద్రజిత్తుతో యుద్ధముంజేయుచు నతని నోడింపలేక "ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యథి" అని "రాముండు సత్యసంధుండగునేని, ధర్మాత్ముడగునేని, యీబాణ మింద్రజిత్తును జంపునుగాక" అని చెప్పితివే యదియేచాలును నీశూరత్వమును చాటించుటకు.

లక్ష్మణ॥ మునికుమారులారా! మీరు బాలకులనియు, బ్రాహ్మణులనియుందాళితి. ఇంక తులువకూతలుకూయక యుద్ధభూమినుండి తొలంగెదరాలేక నాబాణవృష్టికి మీజీవితాగ్నినప్పగించెదరా.

లవ॥ సాహోదరా! ఇతనితో పరిహాసములు చాలును. ఇతని గోడు వినంజాలము. ఏమయ్యా! మేము యుద్ధమునుండి

తొలంగపలయునన్న శత్రుస్తోమముల నీలోకమునుండి తొలంగించినతర్వాతనే. తెలిసితివా ?

(అనుబంధము 30)

లక్ష్మణ॥ అయ్యో ? కాండాసన విముక్త చండతర విశిఖప్రవాహము లుగాని యాశ్రమవృక్షములందలి లేఁజిగురుటాకులు కావు కరవాల ఖడ్గక్షత క్షుభిత రక్తమాంసాంచిత రణరంగముకాని సమారాధనభోజనాంగణము కాదు. కాండాసన కాండ సముదయములుగాక మూపునమోయ దర్భ సమిధలు గావు. బాపలు మీకేల యుద్ధము? మాపురికిరండు వస్త్రమాల్య భూషణాదుల నిచ్చెదము.

(అనుబంధము 31)

కుశ॥ ధరణీశా! ఏండ్లు మితిమీరివచ్చినవికాని బుద్ధినీకురాదయ్యో తెలివి యొకరిసొమ్మయయ్యా? వీరక్షత్రియ వంశదీపకుల మగుమాకు సమరభూమియేకదా మోక్షస్థానము? ఇంత తెలియవైతివికదా ?

సీ॥ చెలువారు పర్ణశాలలు లేకయున్నవే
మీరిచ్చుబంగారు మేడలేల
రుద్రాక్షమాలికల్ రూఢిలేకున్నవే
సొగసైనరత్నాల సొమ్ములేల
నలువారు కృష్ణాజినములు లేకున్నవే
పట్టెమంచముతోడి పరుపులేల
కందమూలంబులు కలుగవే మాకెందు
భక్షింపుటకు పిండివంటలేల

గీ॥ ఆదరంబగు పీబూదిలేదెమాకు
పొలుపునించెడు శ్రీగంధపూతలేల
దాసజనులేల జలతారు తాల్పులేల
యుద్ధరంగమె మోక్షంబు యోధవర్య ॥

(అనుబంధము 32)

లక్ష్మణ॥ మీరుక్షత్రియకుమారులా? మిమ్ముఁగన్న భాగ్యముగల లిల్లి దండ్రులెవరు ?

(అనుబంధము 33)

లవ॥ అది నీకేలనయ్యా ? ఏమి వంశావళి వ్రాసెదవా ? చేతనైన యుద్ధమునకాగతోఽస్మియనుము. లేకున్న జితోఽస్మియనుము.

(అనుబంధము 34)

లక్ష్మణ॥ బాపలారా ! లేవెన్నెలలుసోకిన లోవన్నెతరుగు మీసుకుమారములగు నునుదొడల కరవాలమిడుట పూలరాశియందగ్నినిడుటయేకదా ? చెలువారు కమల నాళముఁబోలు మీకంఠసీమ నర్ధచంద్రసాయకములఁ బ్రయోగించుటమాలతీలతాసీచయముల విత్రమునఁ దరుగుటయేకదా ? ఏల మూర్ఖతఁ బట్టెదరు ?

కుశ॥ అయ్యా! నీవుక్షత్రియుఁడవయ్యు క్షత్రియధర్మమునుఁ దెలియకమాట్లాడుచున్నావు. యుద్ధరంగమేకదా క్షత్రియులకు స్వర్గద్వారము? శౌర్యమేకదా రాజులకుఁబరమధర్మము ? అట్టి స్వధర్మమునువదలి పరధర్మమునాశ్రయించుట నరకద్వారమేకదా ? వేయేల ? ఈయశ్వము నీశౌర్యమునుమా

కప్పగించిన దొరుకునేగాని పనికి మాలిన మాటల నాడిన దొరకనేరదు.

లక్ష్మణ॥ వెఱ్ఱిశిశువులారా! క్షత్రియులైన మాత్రముననే తారతమ్యమును విచారింపవలదా? వీరసూ కౌసల్యానందను లెక్కడ, పసికూనలగు మీ రెక్కడ?

లవ॥ మాతల్లియే వీరసూ కౌసల్యయైన మాతల్లి వీరాధివీరసూ యనుకొనుము. ఊరక వదరినఁ బ్రయోజనమేమి? శక్తి యున్నఁ గూయక చూపుము.

లక్ష్మణ॥ ఔరా! నేను పసిపాపలని కరుణించి యుద్ధమువలదని బోధించినట్లంతయుఁ దిరిగిపెంపు తిండి తల కెక్కి మాటలాడెదరా? ఇఁక మీ శరీరంబుల మాలికలగాఁ బైచి మాతుఱుఁగ ముఁగొని యెద.

(అనుబంధము 35)

కుశ॥ ఈ గ్రుడ్డిబెదరింపుల నెవ్వరినిఁ బెదరింపఁ జూచెదవు? కై కొమ్ము కోదండమును. కై కొమ్ము బాణతూణీరములను. నిన్ను యమునియింటి కతిథిగాఁ బంపెదను. (అనియుద్ధమాడుదురు. కుశుఁడు లక్ష్మణుని బాణముల నెగరగొట్టిధనస్సును విరచును)

లక్ష్మణ॥ (స్వగతము) ఔరా! మోములచక్కదనము చంద్రబింబమును మీర నస్త్రవిద్య శ్రీరామచంద్రునిమీరుచున్నదిగదా? (ప్రకాశము) బాలకులారా! మీవీరత్వమునకు మెచ్చితి. మీరు వీరవర్గశిరోమణులగుదురు. మీకువలయుబహుమతు

లిప్పించెదను. తుదకర్ధరాజ్యమైనను నిప్పించెదను. అయోధ్యకుఁ బోదమురండు. ఇఁక నా ప్రతాపాగ్నికి మిడతలుగా నయ్యెదరు. అపుడు మీతల్లి మీబోఁటి పుత్రరత్నములఁ బోఁగొట్టుకొని దుఃఖపుచావుఁ జచ్చును.

లవ॥ ఏమయ్యా? మరల నీ పిచ్చిమాటల మానకపోతివే? మా తల్లి రణరంగమున శత్రుస్తోమంబులఁదునుమాడి వీర స్వర్గమందిన నదియే పురుషార్థమని భావించునుగాని గ్రద్ద బ్రతికినట్లు బ్రతికి తనవంశమునకును, దేశమునకును, తలిదండ్రులకును, గొంచమైన నుపకారముఁ జేయకయున్న పుత్రకులనుగాంచుట మేలనితలఁపదు.

ఉ॥ సారమహాస్త్రవిద్యభుజసారము మీరఁగశత్రుపంక్తి సం
హారముఁజేసి శూరవరులానన రక్తజలంపు పూరమా
వీరరమాంగనామణికి నేనభిషేకముఁ జేసినఁదల్లిమెచ్చుఁగా
కారఁయునూరుపేరులటు నందని నందనుఁజూచి మెచ్చునే॥

కుశ॥ నీరాజ్యము, నీద్రవ్యము, మాకేమియువలదు. కావలసిన మమ్ము దానమడుగుము. మేమేనీకిచ్చెదము.

లక్ష్మణ॥ (అనుబంధము. 36)

అయిన నాయత్నములేదు. (అని దివ్యబాణముల వేయ కుశుఁడుమూర్ఛపోవును. లక్ష్మణుఁడతనిసమీపించి) అయ్యో నేనెంతవలదనినను మానవైతివిగదా? వ్యర్థముగా ప్రాణములఁ బాసితివే? నిన్నుఁజంపి నేనెట్లువెడలిపోదును?

కుశ॥ నేనును నిన్ను వదలి యెట్లుపోవుదును! రమ్ము. (అని లేచి బాణమును తీసి) ఓ బాణమా! మాతల్లి, సుశీలయైన,

మాగురువు తపోవంతుఁడైన, నీవీక్షణమే నాశత్రువునుఁ బరిమార్చును.

(అనుబంధము 37)

(బాణము వేయును. లక్ష్మణుఁడు మూర్ఛిల్లును)

లవ॥ అన్నా! మన గురువుమహిమవల్లను, మనతల్లిమహిమవలనను నీమహావీరుఁడుపడియెగాక యితఁడు పరాక్రమశూన్యుఁడని తోఁచుచున్నది.

కుశ॥ సందేహమేమి? ఇతఁడత్యద్భుత పరాక్రమవంతుఁడని మనవాల్మీకు లప్పుడప్పుడు చెప్పుచుండలేదా?

[ప్రవేశము. మునిబాలకులు]

అందఱు॥ భళి! భళి!! మిక్కిలి సంతోషమయ్యె. మేమేమైన సహాయముఁ జేయవలయునా?

లవ॥ (స్వగతము) ఇట్లుండవలయు. ఇపుడు లోకమంతయు నిట్లేయున్నది. జయించినవారివంకనే యందరునుఁ జేరుదురు. (ప్రకాశము) ఏమియువలదు. ఊరకున్నఁజాలును. పిచండిలా! నీవుపోయిమాతల్లితో మేమేజయించితిమని తెలుపుము. మేము మరల నెవ్వరైనవత్తురేమో కాచియుండెదము. పొమ్ము. మరల శీఘ్రమున రమ్ము.

పిచండి॥ కానిమ్ము. (నిష్క్రమించును)

(యవనికపడును)



శ్రీ

# లవ-కుశ నాటకము

పంచమాంకము — ద్వితీయరంగము

## హిమవత్పర్వత ప్రాంతారణ్యము

—:o:—

[ప్రవేశము: ఆంజనేయుడు]

ఆంజ॥ ఆహా! ఈ హిమవత్పర్వతమున నివసించు మహర్షులవలన నేఁడెట్టిసంతాపకరవార్తవింటిని? అఖిలలోక మాతయగు మాజానకీమాతను రామచంద్రుఁడు ఘోరారణ్యములకుఁ బంపియున్నాఁడఁట. స్వభావమూఢులై, యసూయా పిశాచావేశితులై, పరదూషణారోపణ మాత్రప్రవీణులై, ఘోరతర సంతాప సత్కీర్తిహరులై యున్న దురాత్ముల దుష్టాలాపనిందావాక్యముల మా రామభద్రుఁడు, మా దేవదేవుఁడు నమ్మి, యీయవాచ్య, క్రూరహింసాకార్య మొనర్చెఁగదా? ఆసీతారాముల శ్రేయస్కర నిత్యాశిష ములఁగైకొని యచిరకాలము క్రిందచేకదా నేనీ తపోవన భూమిఁజేరితి? ఔరా! ఈ యపవాదము సహజసాధు వులగు సాకేతపౌరులద్రిక్షాధఁట! నాఁడు దండకాటవిని

రామలక్ష్మణులచే భిన్ననాసాకర్ణపుటయై, లంకాపురరాజ్య లక్ష్మీవినాశకారణభూతయైన, శూర్పణఖయు, రావణాది దనుజపరిపంథి స్తోమంబులు పరిమార్పఁబడగా హతశేషుఁడై యెందో తప్పించుకొని బ్రతికియున్న యాతిరాక్షుఁడును బన్నిన మాయోపాయ విజృంభసమఁట! కష్టా! కరుణారసమహిమాంచితములై, కమనీయ్యాకమిలిని వేదశిరోవిలసితములై, ఘనతర సనకసనందన హృదయారవింద విలసితములై యున్న యాజానకీ పురంధ్రీమణిరారంజిత నేత్రరాజీవంబులు నీరుగ్రమ్మ, శోకరసమునవాడి యెంత కాంతిఁ బాసియున్నవో కదా? శ్రీరామచంద్రుని నర్ధాంగి లక్ష్మియై, ముక్తికాంతామనోహర మూర్తియై, భక్తలపాలిటి కల్పవృక్షకీర్తియై, దివ్యజ్ఞాన సద్గుణస్ఫూర్తియై లోకులందరకానౌనన, సకలగీర్వాణ బృంద మచ్చెరువంద విలసిల్లు పాతివ్రత్య మహిమంబున నెంతయు వాసిఁగాంచియున్న మాజానకీ జనని యిట్టి తలఁపరాని యపనిందలపాలై పరితపించి పరితపించి యెనలేని కడగండ్ల ననుభవించెనన్న నిఁక పామరభూయిష్టమగు నీప్రపంచపు వారిగతి యేమనవలయు? ఆహా! ఇంత దురంతములగు వంతలకుఁ గారణమా రాక్షసపంద లేకదా? వారిని నేను మననిత్తునా? మదీయ్యవాలాగ్రంబున నాశూర్పణఖా కరాళుల కంఠనాళంబుల బిగియించి, పాదాహతినలచి, దుర్దంతపటుతర మదీయ్యముష్టిఘాతంబున శిరంబులఁబగల్చి, ఉభయకరతల భుజావమర్దనంబున రక్తశోణితంబుల మెదిపి, ముద్దఁజేసి శ్రీరామచంద్రుని పాదకమలంబుల కర్పించెద. ఇదేపోయెద.

సీ॥ కనువారి కనువారికను కలిగింప నలగింప
యపనిందవినియెంత నడలెనో కో.
భూధరావళిస్రుక్కి భూధరావళిదక్కి
భూపుత్రిమదియెంత పొగిలెనో కో
రామసిహ్మముల్లొంది రామసింహ్మము డింది
యకట మారుతి! యంచు నరచెనో కో
పరువారతరు వార పరివారముల జెంది
తనతల్లిదండ్రులందలచెనో కో
గీ॥ రాల్రవాలుమంజలితాపోలెనో కో
పరిగభూదారములుజేరి భావమందు
తనదుభూదారు నెమ్మదిగసియెనో కో
మాదుజనయిత్రి భూమిపై మనియెనో కో॥

(అనుబంధము 38)

(పాడుచు నిష్క్రమించును)

(యవనిక నెత్తగానదే యరణ్యమున మఱియొకభాగము కనుపించును. ప్రవేశము ఆంజనేయుడు పాడుచు.)

(అనుబంధము 39)

ఆంజ॥ అయ్యో! నేనెందెందు వెదకినను మాసీతామాతగాని, తుదకా శూర్పణఖాకరాళులుగాని దొరకరైరి. వెదకివెదకి వేసరితిని. ఇచ్చట కొంతవిశ్రమించి మరలపోయెదగాక.

(అని చెట్లుమరుగుననుండి ఫలముల భక్షించుచుండును)

[ప్రవేశము. శూర్పణఖా కరాళులు]

శూర్పణ॥ భళీ! కరాళా! నీవు కరాళుఁడవేసరి. భద్రుఁడను పేరు పెట్టుకొని రామునిసేవించి సీతకును రామునకును నెడ బాటుఁగలిఁగించితివి. ఇఁక రాముఁడు "సీతా! సీతా" యని మొరయెత్తి యేడ్చుచు నింకొక్క క్షణమునకో రెండు క్షణములకో ప్రాణములవిడుచును. రావణుఁడు, కుంభకర్ణుఁడు, ఇంద్రజిత్తు చేయఁజాలకపోయినపనిని నీవవ లీలసాధించితివి. ఇప్పుడు నామదినున్న దుఃఖమంతయుఁ దీరె.

కరాళ॥ శూర్పణఖా! నీవుచేసినకార్యము మాత్రము సాధారణ మా? చాకలదాని వేషమువేసికొని యెంతబాగుగనటించి తివి? రాముఁడుకాని లక్ష్మణుఁడుకాని ఒక్కరుకాని నిన్ను గుర్తింపరైరికదా?

శూర్ప॥ అంతవివాదమేల? నీవుకొంతపనిని నేను కొంతపనిని సాధించితిమి. ఇంతటితో నేసంతోషింపరాదు, ఇల్లలికినంత నెపండుగయగునా? ముందున్నది ముసళ్ళపండుగ. సీతావియోగమున రాముఁడు పరితపించుచున్న వాఁడుకాని, అతనికి నెవరో వసిష్ఠుఁడట; వామదేవుఁడట; యెప్పుడుచూచినను వేదాంతముఁ జెప్పుచుండుటచేత వాఁడుచావకున్నాఁడు.

కరాళ॥ కానిమ్ము. ఆ మునిముచ్చులపని తర్వాత తీర్చెదము. వారికి కండకావర మెక్కువయైనది.

శూర్ప॥ ఇంక మనము విచ్చలవిడి తిరుగాడవచ్చునుగదా? పోదము రమ్ము.

కరాళ॥ నీవుణ్యామగును. ఊరకుండుము. ఆ యాంజనేయుఁడను కోతియిప్పుడూఱలేదుకావున మనపని కొంచెము గట్టెక్కినది.

శూర్ప॥ వాని భయమునాకంతలేదు కాని మాయన్నవిభీషణుని దేనాకుభయము. నేనొక్కవైపునను నీవొక్కవైపునను పోయి మనకార్యము ఫలించినదా లేదా యనికొంతకాలము కాచుకొని యుందము. ఒకవేళ యింతలోనే రాముఁడు మృతిఁజెందిన నదిమనభాగ్యవిశేషమేకదా?

కరాళ॥ "మృతుఁడయ్యెనా" ? ఏమట్లు మాటలాడుచున్నావు? ఇంకను సందేహమా ? ఇపుడు మనము పట్టినదంతయు బంగారగుచున్నది

శూర్ప॥ ఇంకొకటి నీవు వినలేదా? మొన్న పట్టాభిషేకమప్పటి నుండి మాయన్న రావణుఁడు రామునిఁబట్టియున్నాఁడఁట! ఎందఱెందరొ భూతచికిత్సకులు, మహాసీయ్యులు వచ్చి చూచుచున్నారఁట! ఇది మిక్కిలి మాకు సహకారిగదా?

కరాళ॥ ఔను, ఇఁకపోదమురమ్ము. (అనిపోఁబోవ నాంజనేయుడు వెనుకనుండివచ్చి వారిని చేరియొక చంకలోయిరికించుకొనును)

(అనుబంధము 40)

(నిష్క్రమము)



శ్రీ

# లవ - కుశ నాటకము

పంచమాంకము—తృతీయరంగము



## భాగీరథీ తీరారణ్యము

—:o:—

[ప్రవేశము · శ్రీరాముఁడు]

శ్రీరామ॥ ఆహా! గోరుచుట్టుమీఁద రోకలిపోటువలె నాకిట్టిదుర్దశ రాఁదగునే? హతభాగ్యమై, అపగతవివేకమై, యీరాముని బ్రతుకింత నిరర్థకమగునే? సూర్యవంశపు గౌరవమెల్ల నశింపఁజేసితిని. వచియింపరాని జనాపవాదశూలముల పాలైతిని. ప్రాణాధికప్రాణధనమగు మాసీత నన్యాయముగ నట్టడవినిఁద్రోలి తద్వియోగదావాగ్ని పౌరలనైతిని. నాయనుఁగు తమ్ముల విషమయుద్ధదేవతకు బలియిచ్చితిని. దేనికి దుఃఖింతును? దేనికి పలవింతును? దేనికి పరితపింతును? ఆహా! మాజానకినిఁజూపువారు లేరే. అన్ని దుఃఖములను విధి నాకొఱకై సృజించెఁగాఁబోలు? నాచే ప్రారంభింపఁబడిన హయమేధము హయముతోడనే నిలిచినట్లయ్యె.

ఇన్నిశోకములు నన్ను ముంచిచంపినను మానేఁగాక పర లోకమునందు సైతము ఘోరవాదినరకములు నాకై యెదురుచూచుచున్నవిగదా? యజ్ఞదీక్షాకంకణముఁ గట్టుకొనియున్ననే నెట్లుయుద్ధమునకుఁ బూనుదును? దైవమా! నన్నింత విషమపరీక్షణకు చేయసాగితివి కదా? కానిమ్ము. ఏమేమి యనర్థములు, యేమేమి కష్టములు, యేమేమివిపత్తులురానున్నవో యవి యన్నియు నాకుమహోపకారములుగాఁదలఁచి పరమసంతసమున భరించెదఁగాక. అకటా, నిరపరాధ, నిరస్తకల్మషయగు మాజానకిని, పూర్ణాంతర్వత్నిని గుట్టలఁదోలి, కిరాతకకృత్య మొనర్చిననాకీగతిగాక మరేగతి రాఁగలదు? ఈ బాలకు లెచ్చటనుండి వచ్చిరి? వీరు బాలకులా పరేతపాలకులా? పోయిచూచెదఁగాక. ఆ హయముండు జోకైనఁ దెలయదయ్యెనే?

సీ॥ చేరరేకలికిరాచిలుకలార చెలంగు
కోలకులార మయూరకలుకులార
కదియ రేసీతయానదములారసుకోక
నదములార సుషట్క పదములార
పరికింపరే భూమిప్రతతులార ధరాజ
ప్రతతులార ప్లవంగవితతులార
అరయరే కాంతభూధరములార జలాంత
చరములార వనాభ్రచరములార.

గీ॥ వనితఁగానరె శైలసదనములార
వనములార మృగేంద్ర గణములార
వినుతభూపుత్రి యపరసావిత్రియిందు
చూడరే మానిని ప్రోడనిందు॥

(ప్రవేశము: అరణ్యక వేషముల లవ-కుశులు)

లవ॥ ఆహా! ఈమహానుభావుఁడెవఁడో దేవాంశసంభూతుఁడని తోఁచుచున్నది.

మ॥ అరరే తేజమపారమయ్యెఁ గనగా హరి ప్రభాయుక్తమీ
సరసీజాతముఖంబు పక్షమును విస్తారంబుగానొప్పెనా
యరుణాబ్జాతములట్లు నేత్రములుమాకానందముఁగొల్పెనీ
ధరణీశేంద్రు డెవండొ స్వర్గహరియో దైత్యారియో నారయన్

కుశ॥ ఇతనితోఁబోరి జయించుటకష్టసాధ్యమనియెుఁదోఁచుచున్నది.

శ్రీరామ॥ బాలకులారా! మిమ్ముఁజూచిన నీయరణ్యావాసులని స్ఫురణ గలుగుచున్నది. ఈకాననమున మాయశ్వమేధహయము నెవ్వరోమూర్ఖులగు యిరువురు మునికుమారులు పట్టియున్నారఁట! అదియెక్కడనున్నదో చూపఁగలరా?

లవ॥ అశ్వమునకేమి చూపెదము; కాని మీకా తురంగముతో నేమిపని?

శ్రీరామ॥ అదినాసవనాశ్వము. ఆద్విజకుమారులజయించి దానినిఁ గొనిపోయి యజ్ఞమును సాంగము చేయువలయుననుటయే పని.

కుశ॥ అబాలురు సాధారణముగ జయింపఁ బడువారుకారే యప్పు డేమిచేసెదరు?

శ్రీరామ॥ అది నాకునుఁ దెలియును. అయినను నేనువారని జయించియే తీరవలయును. జయాపజయములు దైవస్వాధీనములే కదా?

లవ॥ అయిన మీపేరేమి?

శ్రీరామ॥ నాపేరు శ్రీరాముఁడని లోకులందురు.

కుశ॥ ఇపుడు మాచే-కాదు-మునికుమారులచే జయింపఁబడిన వారలెవ్వరు ?

శ్రీరామ॥ వారు నాతమ్ములు. భరత లక్ష్మణ శత్రుఘ్నులనువారు.

లవ॥ వారు మీకుకావలయునా? ఆగుఱ్ఱముమీకుకావలయునా?

శ్రీరామ॥ అంతఃకరణమునుబట్టి వారును కావలయు. ప్రకృత కార్యమునుబట్టి తురంగమును కావలయు.

కుశ॥ మీకాయశ్వముఁజూపిన మాకేమిబహుమానమిత్తురు ?

శ్రీరామ॥ తురఁగముతప్ప మీరుకోరినదానినిచ్చెదను.

లవ॥ అయినమీతురఁగమిచ్చటనేయున్నది-చూడుఁడు.(అనిచెట్టు మఱుఁగుననున్న యశ్వమునుఁ జూపును.)

శ్రీరామ॥ ఇదియే మాయశ్వము. అయిన దీనినిఁగట్టిన వీరశేఖరులగు బాలకులేరీ ?

కుశ॥ గొప్పవారు మీరపేక్షించిన వారుదూరముపోవుదురా ?

శ్రీరామ॥ ఏమీ? సమీపముననున్నారా?

లవ॥ సమీపమున ననేల? ఇందేయున్నారు చూడుఁడు. (తమ యరణ్య వేషములఁదీసి ధనుర్ధారులై యెదుట నిలువఁబడుదురు.)

శ్రీరామ॥ (స్వగతము) ఆహా! వీరా యాశ్రమ రులు? వీరిఁగాంచి నాకేదో యొకవ్యక్త మనసునఁబొడకట్టుచున్నది. ఈరక్త రేఖాంచిత నేత్రములు, ఈనిడుదయురము, ఈపున్నమచందురుఁబోలు నెమ్మోము చూడ వీరిని ముద్దాడవలయునని తోఁచుచున్నదికాని కార్ముకముపై చెయిపోవకున్నదికదా?

సీ॥ మోములఁదిలకింప ప్రేమయొప్పునుఁగాని
కోపంబునెమ్మదిఁ గూడఁబోదు
పలుకులవినవేడ్క యొలుకునేకానినా
వీరసూక్తులమోము చేరఁజనదు
అంగశృంగారంబునట్టె చూచునుగాని
కనుదోయి కిన్కకెంపెనయఁబోదు
ధైర్యంబుఁగన నద్భుతముగల్గునేగాని
కార్ముకమొగిఁబట్ట కరముచనదు

గీ॥ భళిరె యీబాలకులజూడ భావమలరె
చెలువుమాజానకీదేవి చిన్నెలమరె
వీర లెవ్వారొ ధీరతాసారులౌర
వీరవర్యులు బాపలు వీరుకారు॥

లవ॥ ఇఁక మాయభీష్టముఁదీర్చుటయేకదా తమకుఁ గర్తవ్యము?

శ్రీరామ॥ ఈ రామునిచరిత్రము మీరువినలేదో? ఇచ్చినమాట తప్పు టయా? అదియెట్టిది?

కుశ॥ ఔనయ్యా! మాగురువులవలన మీగుణాతిశయములనువిని యున్నారము. ఐనను నీకాలమున గొప్పవారినిమాత్ర ము నమ్మరాదు.

ఉ॥ పెద్దలు పెద్దలంచు తగుపెత్తనముల్ పచరించి ధర్మపుం
సుద్దులఁజెప్పుచుందురిలచూడఁగఁ జేయుటయన్న సున్నయా
పెద్దలు లోకమందు బలుపెద్దలు వారినినమ్మఁజాలనే
పెద్దలుదేశవృద్ధినిటుపెంతురు నట్టిలకేను మ్రొక్కెదన్॥

శ్రీరామ॥ తొలుత మీయభీష్టమేమో యడుగుచున్నాను.

లవ॥ మాకేమియు నభీష్టమువలదు. మీరు యుద్ధరంగమునుండి తొలఁగక మాకురణదానమొసఁగిన సర్వాభీష్టములు సమ కూరినట్లు.

శ్రీరామ॥ (నవ్వి) బాలకులారా! మీముద్దారుపలుకులు నామది కెంతయు పారవశ్యము నిచ్చుచున్నవి. మీకు త్రిలోకాధి పత్యమిచ్చినను నాకుతృప్తిగలుగదు. అయిన నీ దానము మీకేల?

మ॥ వలుపల్ వేడుటో, వన్నెసొమ్ములనుతావాంఛించుటో, పిండివం
టలునాశించుటో, విత్తముల్ మదినివేడ్కన్ కోరుటో, దంతివా
జులకాంక్షించుటో, చూడధర్మములుమీక్షోణీసురేంద్రాళికిన్
కలనైనన్ రణమిచ్చకోరనగునే కాంచంగనో బాలకా॥

కుశ॥ పరాక్రమమే భూషణముగా, శూరత్వమే జీవనముగా ప్రజాపరిపాలనమే ముఖ్యధర్మముగా నెంచుమాకు రణ మపేక్షణీయ్యమగుఁగాక యుదరభరణ మపేక్షణీయ్యమా?

శ్రీరామ॥ ఐన మీరు క్షత్రియకుమారులా?

కుశ॥ అది నోటవేఱు చెప్పవలయునా?

శ్రీరామ॥ మీయట్టి శుభముహూర్తుల, మీయట్టి యభినవకందర్పుల, మీయట్టి విక్రమధన్యులఁగని మధ్యమలోకమున కొంక పెట్టని భూషణముసంగిన ధన్యులగు మీజననీజనకులెట్టి మంగళాక్షరములచే యలంకృతులో వచింపఁగలరా?

లవ॥ (జనాంతికము) సోదరా! ఏమి యీమహాపురుషుని వాఙ్మాధుర్యము? ఏమి యీవచన చాతుర్యము?

కుశ॥ ఇట్టిమహనీయ్యునితో మాటలాడఁ గలుఁగుట మనతల్లి యాశీర్వచన ప్రభావమేకదా?

లవ॥ సంగ్రామ లాభము కలిగిన మఱియుమేలు. (ప్రకాశము) ఆర్యభూషణా! ఇది కదనరంగముగాని బంధువావి వరుసల నడుగుటకు పెండ్లింటి భోజనముకాదు.

కుశ॥ మీరేమి యశ్వమేదయజ్ఞమును చేయఁదలఁచుకొన్నట్లులేదు.

శ్రీరామ॥ ఏల?

లవ॥ లేనిపోనిమాటలతో ప్రొద్దుపుచ్చువారలకు కార్యమన్నసున్న

శ్రీరామ॥ కుమారులారా! మీరీతుఱఁగమును బట్టుట తగిన పని కాదు. అందును మీశౌర్యము మ్మాతమ్ములయందు సారక

మయ్యెనని తెలుపకుడు. మీ మోహనాకారములఁగాంచి వారు పరాకున మీచేవంచితులై నిర్జింపఁబడియుందురు. అంతమాత్రముననే యింతటి సాహసమునకు మీరుపూనుట మిక్కిలి లగ్గుగాదు. నామదియు మిమ్ముఁజూచినది మొదలు కరుణాంతరంగిత మైనందున నందున్న ప్రతాపాగ్ని చప్ప చల్లారినది.

కుశ॥ మీరేమి క్రిందపడినను పైచెయ్యనుచున్నారే? మీతమ్ముల మాటటుండనిండు. మీరేమి యుద్ధమునకుపక్రమించెదరా? లేక మాతో సంధిచేసి కొనెదరా? "బాలకుల కేల యుద్ధము" అంటిరికదా? అది మిక్కిలిపొరబాటు. ఏయభ్యాసము కాని బాల్యమునుండియే యలవడవలయు.

శ్రీరామ॥ ఇంక నాయత్నములేదు. బాలులారా! మాగురువులు స్త్రీ శిశువులతోఁ బోరరాదనినందున నింత వచించితినికాని రావణమారణమునఁ దృప్తినొందకున్న నాబాణములకు మిమ్ముబలి యివ్వఁజాలక కాదు.

లవ॥ గురువాక్యపరిపాలనమన్న మొదట మిమ్ము జెప్పవలయు ఆనాడు తాటకనుచంపితిరే? అది గురువాక్యమా లఘువాక్యమా?

కుశ॥ అతికాయునితోఁబోరినప్పుడీ గురువాక్యమును మరచిపోయి యుంటిరి కాఁబోలు?

లవ॥ మాగురువాక్యము వినలేదే? లోకమున నెవ్వరైన మా గురువు లట్లు చెప్పినారని చేయరాని కార్యములఁ జేయువారిని, మాగురువులు కలలోవచ్చి యిట్లుచేయుమని

రనిపలుకువారిని, మాగురువులకుగానుమీరుమాకుధనము
సంగుఁడని మోసంగించువాఁని నమ్మరాదని చెప్పియున్నారు.

శ్రీరామ॥ సీ॥ స్త్రీబాలకులఁజంప చెలఁగుపాపమటంచు
పలికిరి గురువులో బాలులార

కుశ॥ తాటకఁ జంపుచో నేటికి యీబుద్ధి
కలుగకపోయెనో పలుకుమయ్య

లవ॥ అతికాయుతోఁబోరు మనినీదుతమ్మునిఁ
బంపుచో గురువు వచింపలేదె

శ్రీరామ॥ ధరణీవిభుండాట తండ్రిని మీకాదు
తండ్రితో యుద్ధంబు తగునటయ్య

కుశ॥ ధరణీవిభుండీవు తగ లోకవిభుఁడు మాతండ్రి
యాతనిమేముఁ దలఁతుమయ్య

శ్రీరామ॥ ఎవ్వడుమీతండ్రి ? యెట్టిరూపమువాఁడు
యెందుతానున్నాఁడు ? యెట్టివాఁడు

లవ॥ దేవుఁడాతఁడు నీలదేహముకలవాఁడు
ఎల్లెడనున్నాఁడు ఎల్లనతఁడు

శ్రీరామ॥ అతనిపేరెయ్యేది? అతఁడెప్పుడిటువచ్చు
అతనిఁగాంచెడివార లరయ నెవరు

కుశ॥ అన్నిపేర్లతనివే యతనిచేరఁగరాదు
యోగులుచూతురా యోగపురుషు

శ్రీరామ॥ మీతల్లియే సాధ్వి మీరిందునుండుట
కరయఁగారణమేమి యమలులార

లవ॥ గీ॥ సర్వలోకైకజనని మాజనని యిందు
చేరియుండఁగ హేతువు చెప్పరాదు

శ్రీరామ॥ కనుల మిముఁగాంచనేటికో కరుణగలిగె

కుశ॥ కరుణగాదది నీచేతగానితనము॥

శ్రీరామ॥ చాలునధిక ప్రసంగము తాటకను చంపుట మాగురువుల యానతిచేతనే. అదియుండనిండు. మీగురువులెవరు?

కుశ॥ వాల్మీకిమహామునీంద్రులే.

శ్రీరామ॥ వారివద్ద మీరు విద్యాభ్యాసముఁ జేసితిరా? (స్వగతము) హృదయమా! తొందరపడకుము. నీ సంకల్పము సత్యమా యసత్యమాయని తెలిసికొనకనే చెదరకుము. (ప్రకాశము) మీరు వాల్మీకి శిష్యులా? మఱియు మేలయ్యె. వారుమీకు బోధించియేయుందురుకదా?

కుశ॥ ఓ. చెప్పియున్నారు.

శ్రీరామ॥ ఏట్లు

లవ॥ పట్టినపట్టు వదలరాదనియు, క్షత్రియధర్మము పాలింపవలయుననియు, అదియే వీరధర్మమనియు.

శ్రీరామ॥ ధనుర్విద్య నభ్యసించెడి విద్యార్థులు వీరులగుదురా

లవ॥ ధనుర్విద్యాభ్యాసకులు వీరులగుదురుగాక వట్టిమాటలాడు వారు వీరులగుదురా?

శ్రీరామ॥ రాజనీతియందు నెక్కుడగువానితోఁ బోరరాదని చెప్పఁ బడదా ?

కుశ॥ ఎదటివారు మాకంటె నెక్కువవీరులైనఁగదా ?

శ్రీరామ॥ ఇది మీకు గర్వము కాదా?

లవ॥ ఇది మీకు దురభిమానము కాదా?

శ్రీరామ॥ దేహమును వ్యర్థముగ పోఁగొట్టుకొనవచ్చునా ?

కుశ॥ కనుకనే యీసాహసమునకుఁబూనితిమి.

శ్రీరామ॥ పోవనీ. మీతల్లిదండ్రుల యాజ్ఞనైనఁ బొందియున్నారా ? వారీగుఱ్ఱమును పట్టుఁడనిరా ?

లవ॥ ఏమయ్యా? నీవు మంచిగట్టివాడఁవే. మెడకు వేసిన కాలికి, కాలికివేసిన మెడకు వేయుచున్నావే ?

కుశ॥ మాతల్లి మాకు స్వధర్మములను రక్షించుకొని తనకు కీర్తిని తెమ్మనిచెప్పినది. మాతండ్రి దేవుఁడు; గనుక అందు నయు స్వధర్మత్యాగముఁజేసి పరధర్మము నాశ్రయించి దేశమును, కులమును నాశనముచేయుమనిచెప్పలేదు. తెలిసి నదా ?

లవ॥ ఇతఁడేమి యుద్ధము చేయునురా? మాటలు కోటలు దాటు చున్నవికాని కాలు గడప దాటకున్నది? తమ్ములపాటు జూచినను నితనికి కోపమేరాదుకదా ?

శ్రీరామ॥ ఆహా! ఇంక తడయుట దుస్సాధ్యము కలుపాత్ములారా ! ఇఁక మిమ్ము విడువను. (అనిదారుణాస్త్రములప్రయోగిం

చును. అవి పూలహారములై వారికంఠములఁబడును) ఔరా అదియేమి యాశ్చర్యము? నా బాణములు పూలహారములే యైయుండునా ? (కోపముతో) ఇప్పుడైనను మీయజ్ఞానమును వదలెదరా లేదా ? (అని నారాయణాస్త్రమును తొడగును.)

కుశ॥ (జనాంతికముగ) ఆహా ! ఈయుగ్రాకారము కనులకు మిరుమిట్లుగొలుపుచున్నదిగదా? ఈభయంకర తేజముచే మనకు బాణాసనముపై చేయియే పోవకున్నది కదా ?

లవ॥ ఊరక మనతల్లివద్దకు పోవుదమురమ్ము.

కుశ॥ (అస్త్రమును తొడిగి)

గీ॥ మహిని మాతల్లి లోకైక మాతయేని
ఆమె సత్కీర్తి జగముల నలరునేని
జనని మాజానకీదేవి సాధ్వియేని
ఇతఁడు నీయస్త్రమున మూర్ఛనెనయుఁగాత॥

శ్రీరామ॥ హా ! జానకీ ! జానకీ ! (మూర్ఛపోవును)

[ప్రవేశము: శ్రీఘ్రముగ శూర్పణఖాకరాళులతో ఆంజనేయుఁడు. శ్రీరాముని వద్దకు వచ్చిచూచి]

ఆంజ॥ రామా ! రామా ! రామా ! లోకాభిరామా ! ఈదేవుఁడు మూర్ఛిల్లియుండుటకేమి కారణముండవచ్చును ? (బాలకులఁజూచి) బాలకులారా ! మీరేనా మారామచంద్రు మూర్ఛనొందించినవారు ?

లవ॥ లేదయ్యా! అతఁడే యేలనో మూర్ఛిల్లి యున్నవాఁడు.

ఆంజ॥ కల్ల. మిమ్ము విడువను. చచ్చితిరిఁక నాముష్టి ఘాతమునఁ.

(అనిచెయ్యెత్తును. లవకుశులు రామధ్యానముఁ జేయుదురు)

(అనుబంధము 41)

(ఆంజనేయుఁడు నృత్యముఁ జేయుచుండును. లవకుశులు రామధ్యానముచేయుచు నిష్క్రమింతురు. ఆంజనేయుఁడు వారిని వెంబడించును.)

(యవనికపడును.)



శ్రీ

# లవ - కుశ నాటకము

పంచమాంకము—చతుర్థరంగము

## పర్ణశాల.

(సీతయు వాల్మీకులును కూర్చుండియుందురు)

వాల్మీకి॥ అమ్మాయీ! ఇంతలోననేవత్తురు. నీకుమారులకేమైన నాపదకలదా? ఊరడిల్లుము.

సీత॥ జనకా? ఇంతకాలము నన్నుఁ బాలించితివి. రామదర్శన భాగ్యము నాకుఁగలదాలేదా?

వాల్మీకి॥ అమ్మా! అంతయుఁ దెలియఁగలదు. ఒకక్షణములో నీవు నీనాథునితోఁ జేరుదువు. సత్యము. నేనుసంధ్యావందనము తీర్చివచ్చెదను. ఏమియుభయపడకుము?

(నిష్క్రమము)

[ప్రవేశము: కుశ కుమారుఁడు]

కుశ॥ తల్లీ? నమస్కారములు.

సీత॥ జయసిద్ధిరస్తు. కుమారా! నీతమ్ముఁడేడీ?

కుశ॥ అమ్మా! వెనుకవచ్చుచున్నాఁడు.

సీత॥ మీకు జయమే కలిగినదికదా?

కుశ॥ తల్లి! అంతయు నీమహిమయే. అశ్వమును సాధించితిమి.

సీత॥ వారేమైరి? వారు శూరులేనా?

కుశ॥ లోకైక వీరులని వచ్చును. వారు నీవుపదేశించిన మాత్రముఁ చేతనే మూర్ఛిల్లిరి. తుదకెవరో యొకమహాపురుషుఁడు నీలమేఘశ్యాముఁడు వచ్చెను. అతని బాణాగ్ని మమ్ములనుఁ గాల్చుచుండెను. మేము నీధ్యానమునొనర్చితిమి. నీపేరు వినఁగానే యతఁడు క్రిందపడియె అతనివద్దనుండి యీ మాణిక్యమునుఁ దెచ్చితిమి (మాణిక్యమిచ్చును)

సీత॥ (రిచ్చవడి మాణిక్యమునుచూచి) హా! రామా! రామా! (అని క్రిందపడును.)

కుశ॥ తల్లీ! తల్లీ! (అని శైత్యోపచారములఁ జేయును.)

సీత॥ (లేచి) కుమారా! ఆమహానుభావుఁడు, ఆనీలమేఘశ్యాముఁ డెచటనున్నఁవాఁడు? ఎట్లున్నవాఁడు? అయ్యో! అలనాఁడు మేమరణ్యమునకుఁబోవునపుడు మాయత్తకౌసల్యాదేవి రామచంద్రునకుఁ గట్టిన రక్షామణి కదాయిది?

కుశ॥ తల్లీ! తల్లీ! ఆరాముఁడెవరు? నీవు శోకించుటకుఁ గారణమేమి? తెలుపుమా తెలుపుమా, నీకు నమస్కరించెదను తెలుపుమా. (అనికాళ్లఁబడును.)

సీత॥ అయ్యో! అతఁడు మీదైవము. మీగురువు. మీపాలకుఁడు

గీ॥ మీదు దైవంబు మీదాత మీగురుండు
మీనిధానంబు భాగ్యంబు మీదుస్వామి
మీదుజీవంబు మీకల్మి మీధనంబు
మీకులాధ్యుండు మీతండ్రి మీకు లేడు॥

కుశ॥ అమ్మా ! మేము కలుషాత్ము లైతిమి. పితృహింసకుల మైతిమి. మాగతియేమి ? నీవేల మాకుఁ జెప్పక పోయితివి ?

[ప్రవేశము: లవకుమారుఁడు పాడుచు; వెంట ఆంజనేయుఁడు శూర్పణకా కరాళులతో]

(అనుబంధము 42)

ఆంజ॥ (ఆశ్చర్యమున ఆహా ! మాజానకీదేవి ! మాలోకమాత ! ! మాతల్లి ! ! ! (నమస్కరించును)

సీత॥ (దుఃఖముతో) అన్నా ! మారుతీ ! నీ వెక్కడినుండి వచ్చితివి ? మీరాముఁడెందున్నాడు ? ఆదేవుఁ డెటులున్నాడు? చూచితివా నీస్వామిని ?

ఆంజ॥ తల్లీ! రామచంద్రుడు యుద్ధమునకు వచ్చినాఁడన్న యుదంతమువిని తపముఁ జేయుచున్న నేనాతని దర్శింపవచ్చితిని. రాముఁడు మూర్ఛిల్లియుండెను. ఈ బాలకులు సీతరామ మంత్రముచే నన్నుఁగట్టివైచి నీయొద్దకుఁ గొని తెచ్చిరి. వీరెవరు ?

సీత॥ మారుతీ ! పితృఘాతకులై నాయుదరమున దురదృష్ట వశమున జనించినవారు.

ఆంజ॥ వీరు నీనందనులా? మాస్వాములుకదా వీరు ? నాచిన్న ప్రభువులుకదా వీరు ? నేడు ధన్యుడ. నేఁడుకృతార్థుఁడ (అనినమస్కరించును.)

సీత॥ అంజనాతనయా! మా రామచంద్రుని నాకుఁజూపుమా. మా దేవదేవుని నాకుఁజూపుమా. అకటా! దిక్కులేక యనదనైయున్నను నతని క్షేమవార్త వినినైన సంతసించుచుంటినే? ఇఁక నాగతియేమి? నాకెద్ది శరణము? హా! శ్రీరామా!

[ప్రవేశము వాల్మీకి, జనకుఁడు.]

వాల్మీకి॥ జానకీ! జానకీ! భయపడవలదు. కుమారీ! నీనాథుఁడు నీపేరు విన్నమాత్రమున నధికదుఃఖార్తుఁడై యున్న కారణమున మూర్ఛిల్లియున్నవాఁడు. ఈకుమారులు నీకుమారులని తెలిసినందున దుఃఖప్రేమాధిక్యములవలనఁ గలిగిన పారవశ్యముకాని వేరపాయముకాదు పోదమురమ్ము. రామచంద్రు నొద్దకు. కుమారులారా! మీజనకుని దర్శింతురఁటరండు.

జనక॥ తనయా! ఇదియే నీ సంతోషసౌధ ముఖద్వారము. నీకుఁగలిగిన యవరోధమునుమాని శుద్ధమాయాస్వరూపిణివై వెలుగొందుము. లోకనాథులగు సీతారాములఁ గాంచి జగము సంతసించు. రమ్ము పోవుదము.

[ప్రవేశము: ఆంజనేయుఁడు శూర్పణఖా కరఖులతో]

ఆంజ॥ (వాల్మీకులకు నమస్కరించును.)

వాల్మీకి॥ పావనీ! మంచివేళకువచ్చితివి. నీవు లేని రామాయణము కలదా? పోదము రమ్ము.

(నిష్క్రమింతురు)

---

శ్రీ

# లవ - కుశ నాటకము

పంచమాంకము—పంచమరంగము.

## యుద్ధభూమి.

[శ్రీరాముఁడు పరుండియుండును. జనకుఁడు కూర్చుండియుండును. వాల్మీకులు ప్రక్కనకూర్చుండి యభిమంత్రింతురు.]

శ్రీరామ॥ (లేచి) మునీంద్రా! వాల్మీకి చంద్రా! తమదర్శనము నాకెట్లుకలిగె? ఏరీ ఆకుమారులేరీ? త్రిలోకవీరులేరీ? జానకీ వరపుత్రులేరీ? చూపుమా. చూపుమా.

[ప్రవేశము; ఇరుప్రక్కలనుండి పాడుచు శీఘ్రయానమున లవ - కుశ కుమారులు.]

(అనుబంధము. 43)

శ్రీరామ॥ కుమారరత్నములారా! శూరవసంతములారా! ఈపాతకునినేల వేఁడెదరు? వీఁడు మీకుఁదండ్రికాఁడు. క్రూరుఁడు, కిరాతకుఁడు. హా! సీత! నాయంత్యకాలము సమీపించుఁ గాఁబోలు! నా మానసమును! నా సర్వాంగములును తాపబాధితములై యున్నవి. లోకాపవాద మూలమున

నిన్నుఁ గన్నులారఁ జూడకున్నాఁడను. మదియందు నిన్నే ధ్యానించుచున్నవాఁడ.

వాల్మీకి॥ రామచంద్రా! పరమవిజ్ఞాన ధన్యులగు జనకరాజేంద్రులు మిమ్ము దర్శింపవచ్చియున్నారు.

శ్రీరామ॥ రాజేంద్రా! మిమ్మిందుదర్శించుటచే ధన్యుండనైతిని.

(అని నమస్కరించును)

జనక॥ రామా! నిన్ను దర్శించుట భాగ్య మెన్ని జన్మములు తప మొనర్చినఁ గలుగవలయు?

[ప్రవేశము: శూర్పణఖా కరాళులతో ఆంజనేయుఁడు.]

ఆంజ॥ (శ్రీరాముసకు నమస్కరించును.)

శ్రీరామ॥ అంజనాతనయా! నీవెప్పుడు వచ్చితివి? ఈ శూర్పణఖను నీవెట్లు తెలిసికొంటివి? ఆహా! జానకీ! నిరపరాధ వగుట జగమెఱిగియున్నను నిన్నుఁ గటిక మానసమున నడవిఁదోలిన నిర్భాగ్యుని నొకతూరిచూచుట మహాపాతక కార్యము. అయినను ఏదీ నీ మోముదమ్మి నొకపరి నాకుఁ జూపుమా. నాకుమాపణఁ గైకొమ్మా.

[ప్రవేశము: సీత పాడుచు]

(అనుబంధము 43)

శ్రీరామ॥ (ఆలింగనము చేసికొని) జీవితేశ్వరీ! ఈ కుమార హింస కుని, నిండుగర్భిణి నించుకంతయు నక్కటికములేక బాధించిన పాపాత్ముని జూడఁగల్గితివిగా? ఇదియే నీవరపురంధ్రి

చారిత్రమును సూచింపుచున్నది. నన్ను మన్నింపుము. నాయపరాధముల మదినుంచకుము. అట్లైన నాయంత ర్దహనా పశ్చాత్తాపము తీరఁగలదు.

(అనుబంధము)

సీత॥ నాధా! అంతయు నా పూర్వార్జితఫలము; ఇందు నీయప రాధ మేమున్నది. సర్వభూత దయామయుఁడగు నీకిట్టి బుద్ధి కలుగవలయునన్న నాగ్రహచారము కదా ?

ఆంజ॥ దేవా! ఇది మీయపరాధము కాదు. ఇదియంతయు ని దురాత్ముల కృత్యము (అని శూర్పణకా కరాళులను చూపి) వీరు చాకలివేషముల వేసికొని మిమ్ము మోసగిం చిరి.

వాల్మీకి॥ దేవా! ఇదియంతయు నీకు శాపఫలముకాని వేరుకాదు. అది తీరిపోయినది. ఇది సమ్మోదకాలము. ఈకుమారు లకు నాయెదుట యువరాజ్య పట్టాభిషేకముఁ జేయుము.

జనక॥ సీతారాములారా! ఇపుడు మిమ్ముం గాంచితిని. నాఁడు మిధిలాపురమున మీ వివాహమునాఁడు మిముఁజూచుటచే గలిగినసంతస మిప్పుడు కలిగినది. నాదౌహిత్రుల యౌవ్వ రాజ్యాభిషేక మహెూత్సవము కన్నులార జూడవలయు నని యున్నవాఁడ; దాని కనుమతింపుఁడు.

శ్రీరామ॥ మునీంద్రా! నాతమ్ములు ?

వాల్మీకి॥ సందేహములేదు. వారయోధ్యాపట్టణమున నపుడే మేల్కాంచియున్నవారు.

శ్రీరామః ఆంజనేయా! ఈ శూర్పణఖాకరాళు లపరాధులైనను నిట్టి సంతోష సమయమున వీరిని దండింపరాదు. వీరి కభయ మిచ్చియున్నాఁడ.

(ఆంజనేయుఁడు శూర్పణఖాకరాళుల విడిచిపెట్టున వారందఱికిని నమస్కరింతురు.)

లవ-కుశ కుమారులను కూర్చుండఁబెట్టి పట్టాభిషేకము జరుపుదురు.

(అనుబంధము 45.)

మంగళము.



# అ ను బ ం ధ ము.

మాల్ కోస్ రాగము. చాపు తాళము.

అందరు|| కృపారామ-శ్రీరామ-నారాయణా
అపారాగ-మోద్ధార-ఆలింపుమా ||కృపా||

మహాదైత్య సంహార-మానాయకా
మనోభక్త-సంరక్ష-మందారమా ||కృపా||

మునీంద్రా మనోవాస-దీనావనా
ఘనాధామ-శ్రీరామ-ఓరాఘవా ||కృపా||

నౌరోజు రాగము. ఏక తాళము.

అందరు|| ధరణిని-స్థిరంబు నేలు-రఘువర-
సుఖంబుగన్-జనంబులన్ ||రఘు||

భరతు|| ఖేదముల్-వాదముల్-భేదముల్ - పోవగా-సాదరమతి స-
మ్మోదము చెలగన్-సోదరులన-నెల్లర బ్రోవుముదయ ||రఘు||

శత్రుఘ్న|| ఇన్నాళ్ళకున్-కన్నారగా-నిన్నిందులన్-కన్గొంటిమి
కలుషము చనె స-త్ఫలములు వెలిగెన్ - బలు వెతలడగెన్
రఘుకులభరణా

ఆంజ|| రామా - సురుచిరదనుజ భీమా-రవిశశిలెదివర-క్షేమా -
రగనిల వెలయున్ భూమిన్ - అది వర - కరుదుగ-ధరణిని
మనుపుము ||రఘు||

లక్ష్మణ॥ పరులై - సుఖతత్పరులై -పతి భక్తిరలై -తగు సుందరులకా-
మనుపక-ఘనసతులై -తనరగ ధర్మము నెపుడుక-నిలుపు
దయ్యా-పన్నుగ-నాదర మెన్నగ-నందర చెన్నుగ-బ్రోచుచు-
సన్నుతరఘుమణీ ॥ధర॥

సీత॥ వాణులక్ -బుధగీర్వాణులక్ -శ్రుతినింద్రాణులక్ -మణినింద్రాణ్ణం
బులునక్ -శుభంబు-సలలిత-సుఖంబులొసగుత ॥రఘు॥

శ్రీరామ॥ ఇందిర-రమణుఁడు నిటు-మమ్మిందు-ఆనంద-మలరఁగనిఁడు-
నొందింప-మీరంద-రనుపమదయ నొందంబు-మీరక-బ్రో
వగ-ఎందు నేలెదక - అందముమీరచ-మంద శుభోద
యమెందును నొసఁగుఁడు॥

నాటకురంజిరాగము. ఆదితాళము.

సీత॥ ధీరమారుతీ-రమ్మా-వీరాగ్రణి
కోరి రామవార్త-కూర్మిఁదెల్పినట్టి ॥ధీర॥

శోకసంద్రమందు-సొలసియున్న నన్ను
వీకబ్రోచినట్టి-ధకుమార యిందు ॥ధీర॥

మాల్కోస్‌రాగము. ఆదితాళము.

ఆంజ॥ అమ్మా కోతికి మణి-హార మదేలా
ఇమ్మా రాముని-పాదభక్తిని ॥అమ్మా॥

రాముఁడెదైవము - రాముఁడెభావము-రాముఁడె ప్రాణము
రాముసిధానము ॥అమ్మా॥

రామారాఘవరామ-ప్రేమంపుకరుణను
నామానసంబున-తిరముగనిలుమా

నీమహిమంబును - నేర్తునె తెలియగ
ఇమ్మాజ్ఞానము - ఇనకుల భూషణ ||అన్యా||

5. కాఫిరాగము. ఏకతాళము.

అంజ|| కనుగొంటినాదైవ దైవంబును
కనుగొంటి శ్రీరాము నభిరాముని ||కను||

కనుగొంటినాభాగ్య సుఫలంబును - కనుగొంటినాతపో
పుణ్యంబును - కనుగొంటిశ్రీరామ తత్వార్థము ||కను||

ధన్యుండనైతినే-మాన్యుండనైతిగా
చెన్నారనానోము-లీడేరెగా ||కను||

6 1-వ పాటయే.

వృషభగతిరగడ.

0. యదుకులకాంభోజిరాగము, అటతాళము,

రామ|| కానజానకిసూనసోనలు- కానకానగనయ్యెమానిని
సీత|| తేనెవానలనూనమానగ- తేటులాటలపాటపాడవె

రామ|| వారినీరజవారమారగ-నంచలంచుగసంచరించెగ
సీత|| కోరిసారసకీరవారచ-కోరబృదమునందమొందెను

రామ|| సీతశీతలకాంతగాతక-చిత్రలాస్యము నేత్రపాత్రము
సీత|| భీతవాతసుపోతవ్రాతము-నేతరించెనుసాతిమోదత

రామ|| బాలబాలరసాలసాలపు-పాళులలరెనుపాలుపుమీరగ
సీత|| నీలతాలతమాలజాలము-నిరతపాంధసుఖంబునించదె

8. సురటిరాగము. రూపక తాళము.

సీత॥ వనసీమ-కరుగగనా-కానతిచ్చి బ్రోవుమా
ప్రాణనాధమానుమనుచు-పలుకకుండ వేడుదాన ॥వన॥

రామ॥ ఎలనాగ-యీవాంఛ-ఏలకలిగెనీకు-పలుబాధ
కలిగించు-బాలఘోరకాననంబు ॥ఏల॥

సీత॥ మునిభార్యలనుజేరి-మనసారనుండకోర్కె-మొనసి
నాకురామచంద్ర-కనికరంబుచూపుమా ॥వన॥

రామ॥ మొన్నగదా-మునిభార్య-లున్న కానమాననయ్యె
ఎన్నవలదీ. కానికోర్కె-సన్నుతాంగి-వలదువలదు ॥ఎల॥

9. కేదారరాగము. రూపక తాళము.

సీత॥ దయగనుమారమణా-తాపసాశ్రమంబుఁజేర ॥దయ॥

రామ॥ ఇదితగునా-లలనా-యేలయిట్టివాంఛితంబు ॥ఇది॥

సీత॥ నా-థా-అ-లిం-పు-మా ॥దయ॥

రామ॥ బా-లా-మే-లా-యీ-లీ-ల ॥ఇది॥

సీత॥ కీడా-మేలో-వీడఁ-జాల-వేడుదాన ॥దయ॥

రామ॥ కాన-నంబు-కాన-లేదె-మానుమింక ॥ఇది॥

సీత॥ మునిభా-ర్యలతో-ఘనలీ-లలనే-గనగఁ మనుపవె॥ ॥దయ॥

రామ॥ వనజే-క్షణసీ-మనమీ-గతికిఁ-చనగఁ-వలయునె ॥ఇది॥

సీత॥ నమ్మినభామినితా-నెమ్మదికోర్కెలని-యిమ్మని
వేడగను-నొసఁగక మసలుట యుచితమె ॥దయ॥

రామ॥ సుందరియీగతినా-నందమెకానలనీ-పొందితి
మొన్ననెగా-అడుగక నుడుగుము పడతిరో ॥ఇది॥

సీత॥ మానక_జాల-రామా-

కానలకై నను-నేగగమనమునఁ-దలచితి ॥దయ॥

రామ॥ దైవా-యత్తం-బేమొ-

తలపఁగజాలనునే-తాపము-కలిగెను తలపగ ॥ఇది॥

10 వసంతరాగము. ఆదితాళము.

శ్రీరామ॥ పల్క_జాలనే-పాపపుమాటల

పరమహేయముల్-పాతకమడరదె ॥పల్క॥

మహాశోకమా-మానసమందుల

మాటలవెలికిని-దాటగనియ్యదు ॥పల్క॥

11 హిందూస్థాని జంఝూటిరాగము. ఏకతాళము.

లక్ష్మణ॥ నే మహాపాపుఁడనునైతి-పరలోక-దూరుఁడైతి-
అపయశం_బందనైతి
జననిరో-కాననంబులఁవిడిచిచనఁగనే-మనఁగజాలనే ॥నే॥

ఈమహాతాపమెటులోర్తు-పలుకంగనెటులనేర్తు
కలుషుఁడై-గర్భవతినినే-కటికయడవినే-గనగ త్రోయగా॥

12 మాండ్ రాగము. చాపుతాళము.

లక్ష్మణ॥ మాతయింత-వంతనిచ్చు-పాపుఁడ
ఇంతనన్ను-మదినికరుణ-చూడకే ॥మాత॥

అంతమొంద-శాపమిచ్చిబ్రోవవే
సంతసంబు-గల్గునాకు-అమ్మరో ॥మాత॥

సీత॥ అన్ననింద-లెన్నో యోంద-నాయెంగా
ఎన్నఁడాయె-కరుణరాముఁ-వలకో ॥అన్న॥

ఉన్నవృత్తము-తెలియఁడాయె-కన్నారఁ
అన్నియాశ-లణ్టిపోయె- లక్ష్మణా ॥అన్న॥

13 ధన్యాసిరాగము రూపకతాళము.

లక్ష్మణ॥ అమ్మరో! -అడవినెట్లువిడతునే
నెమ్మనంబు-తల్లడిల్లె ॥అమ్మరో॥

సీత॥ లక్ష్మణా ! -చింతయేలమానుమా
నాదుప్రాప్తి-యిట్టులుండ ॥లక్ష్మణా॥

లక్ష్మణ॥ తల్లీ-వనటగలిగెపెల్లై-విడచిచనగలనెఁపుడమి ॥అమ్మరో॥

సీత॥ సౌ-మి-త్రీ-శో-కం-బే-లా-నీకు ॥లక్ష్మణా॥

లక్ష్మణ॥ ఈరేడు-జనులుఁ-మునులుఁ-సురులుఁ-చూడంగ
అనలంబుననీవెనయవె-మాయమ్మ-వరసాధ్వినినిఁ
అటవిఁ-త్రోయించి-మనగఁ-గలనెజనని ॥అమ్మరో॥

సీత॥ నాదునొసటిటులఁ-విధివ్రాయమటికలదే-ఇదినాదు
పూర్వజన్మ-పాపమింక మదినడలకుమా ॥లక్ష్మణా॥

లక్ష్మణా॥ నీ-కరుణచె-మముకడుఁ-నరశితజనని-వరప్రేమను-
మమ్మరయఁగా-కంటిమోౘజనకతనయ-మనమున-
శోకము కలిగెను. ॥అమ్మరో॥

సీత॥ మాయన్న-ఘనతరముగ నా శేవ-సలుపుదుగద
వేభక్తి-బలువనములనాకింక- శేవల్ -ప్రమోదమున
సలుపఁగ-మహాత్ము లెవరిటు చెపుమా-శుభ మొదవును-
ననుమది మఱువంగవలదు. ॥లక్ష్మణా॥

14 ముఖారిరాగము. రూపకతాళము.

లక్ష్మణ॥ నీకి యొ్యా-దిక్కు-నెవరు-
యీావనంబునందు- తల్లిరో ॥నీకి యొ్యా॥

లోకజననీ-నీకీగతి-శోకముకలిగనుసకటా
కీకాటవి-కాపుడయ్యె-ప్రాకటసురవర్యులారా ॥నీకి యొ్యా॥

పరమసాధ్వి-నీదుకోడలి-నరయనీకు-నప్పగింతు
కరుణనీవె-చూడుమయ్యా-ధరణిదశరథావనీశ ॥ నీకి యొ్యా॥

15 రాగము. తాళము.

వాల్మీకి॥ మానుమింక-తాపము-జానకీ
ప్రాణనాథు-కాననౌను-భామినీ ॥మాను॥
లోకమాత-నీవెయేల-శోకము
వ్యాకులంబు-మానుమమ్మ-పావనీ ॥మాను॥
వెతలుబోవ-సుతులగనెదు-అతివరో
పతినిజేరి-సుఖముగందు-వమ్మరో ॥మాను॥

16 సావేరిరాగము. ఆదితాళము.

సీత॥ రఘురామ-మనుపుమా-రామా
ఎందునేనీముఖ-చందురుగాంతునో-
చెందనీవగబాయుదు ॥రఘు॥

ఇనకులభూషణ-ఏలుమా-దీనను-రాగదే-రామా
రామా ॥రఘు॥

17 కమాజురాగము. ఏకతాళము.

లవ॥ } వరసరోజలోచనరామ-రఘుకులాబ్ధిసురుచిర
కుశ॥ } సోమ-రఘురామ-పరంధామ-అరిభీమా ॥వర॥

ధరణిజామనోంబుజకామా-సురవరావదభిరామా-
దయగనుమా-మదిగొనుమా-వరనామా ॥వర॥

18 [illegible]రాగము. ఏకతాళము.

లవ॥ } ఏలమ్మాయిటు-దురంతచింత
కుశ॥ } చాలశోకమొందనేల-దురంతచింత ॥ఏలమ్మా॥

కుశ॥ కన్నులనీరిటు-కారగనేల-మన్ననదెల్పవె-మమతచె
తల్లిరో ॥ఏలమ్మా॥

లవ॥ తనయులమమ్మల-గనియిటుశోకము-కనగను
నేలను-వినుమిదిజననిరో ॥ఏలమ్మా॥

19 కానడరాగము. ఆదితాళము.

లవ॥ ఇటుపిఱికిపలుకు వినకమ్మా
ఇదినరునికుండ తగదమ్మా ॥ఇటు॥
బాణముచేకొని - వైరులజంపక
మానినక్షత్రియుండౌనా ॥ఇటు॥

20 శ్యామకల్యాణి రాగము. ఆదితాళము.

లవ॥ } రఘురాముచరితమును -వినుమమ్మా[illegible] ॥రఘు॥
కుశ॥ } రాముని సీతా-రామునిం దలచిన్న-[illegible]లగునుగా

లవ॥ ఖరదూషణాదులను-ఖండించెనుగద
వాలినికోలంగూలఁగనేసెను-
రాముఁడు రాముఁడుగా ॥రఘు॥

కుశ॥ జనకాత్మజనుకూడి-జగమెల్లఁ బరి
పాలన సేయు-భవ్యుఁడు రాముఁడు-
నారదవంద్యుఁడుగా ॥రఘు॥

లవ॥ ధరరావణాదిదనిమి-దయచెన్నారెను
రాముఁడు నేఁగా-రాముఁడుకలిగిన-మోక్షముకలుగునుగా॥

21 శంకరాభరణము. ఏకతాళము.

జనక॥ విడువిడుబాలక-మృగమునుపట్టకు
వినోదమా-యిది-ప్రమోదమా ॥విడు॥
ఘనతరమా-గనతరమా
చూడఁగ వేడుక-కాదిదితలపఁగ
వినోదమా-యిది-ప్రమోదమా ॥విడు॥

22 హిం-తోడిరాగము. ఏకతాళము.

కుశ॥ దుడుకునపలుకకుమా-యెడగునగు
కడుకొనిమృగమును-నెడరునడుగకు ॥దుడుకు॥
కాలరుద్రుఁడగు-నేమికావగా-కాలుపూనకటునావల
పోమ్మా-చాలవింకవడి-పరుగిడుపలుకక ॥దుడుకు॥

23. మధ్యమావతిరాగము. రూపకతాళము,

బాలకులు॥ రారవేటలాడుదమురారా-వేడుకలరగా
బలుసింగంబులనెల్లఁ-నలుముచుపులులను వేగ
నలచినలచి-నెతలపఱచి-జగముఁ బెనచి-ముదము
పెంచఁగా ॥రార॥

ఘనకుంజంబులలోనఁ-వనమహిషంబులమరియు
కరులయెలుల-తరలదునిమి-ఫులులనదిమి-భరము
డించఁగా ॥రార॥

కలకాలంబును నెంతో-జనములనలచెడివానిఁ
కదలనియక-మెదలయక-వదలిచనక-చెదర
చంపఁగ ॥రార॥

24 కాఫీరాగము. ఏకతాళము.

శత్రుఘ్న॥ నినుమదమణచెద పలువా-గనుమా
రాముని యెడనీ-రా ఋడిచెల్లునె-భూమినినీవిక బ్ర
దుకవుపోరా-శరం-బిదే-నినుఁ-హరిం-పగ వెలగెను రా
పలు వా-గనుమా ॥నిను॥

కావరముందు మనీవిటుహాయమును-లావునబట్టితి
దక్క-వు క్రూరా-జనం-బులుఁ-గనఁ-నినుఁ- యిలగూల్చె
దరా - కనుమా - పలువా ॥నిను॥

25 కమాజురాగము. ఆదితాళము.

శత్రుఘ్న॥ బాలకచాలవు - ఆలమునఁ
కాలముతీరెను - కానవురా ॥బాలక॥

లవ॥ ఏపునచూపుము - శౌర్యమును
ఈపరిమాటలు - నోపవురా ॥ఏపున॥

శత్రుఘ్న॥ శూలియడరినఁ - స్రుక్కణగింతు

లవ॥ ఏల - ఇట్టుల - బీరము - పల్కెదు
కాలుని - చెంతకు - నంపెదను

శత్రుఘ్న॥ చాలునునీవిక - చచ్చితిరా

లవ॥ నీమానము - ప్రాణము - నీగెదురా

ఫీల్ రాగము. ఏకతాళము.

సీత॥ సుకుమార-రణమునచనితే
శోకంబే-గతితాళుదాన
ధర నే-గతినే-మనఁగలదాన ॥సుకు॥

సొగసగునగు వె-న్నడుగనుదాన-చెక్కిలినొక్కి-నే
ముద్దిడుదాన-చెలునొ-పలుకె-న్నడువినుదాన ॥సుకు॥

27 శామకల్యాణిరాగము. రూపకతాళము.

కుశ॥ వాఁడెవ్వాఁడు-నొంతునేఁడు-పట్టితెత్తు పేరువాడి
పాదముల చేర్తునే-ప్రాణములతీర్తునే ॥వాఁడె॥

ఇంద్రుఁడైన - యుపేంద్రుఁడైన-మించిద్రుంచి నొంచివైతు
శోకమేలనమ్మరో-వీకపంపుతల్లిరో ॥వాఁడె॥

28 కాఫిరాగము. ఆదితాళము.

కుశ॥ ఏపలువా-కొనుచుచనెనో-పలుకుడికనేవాని-
మదమణతుఁ ॥ఏపలువా॥

పటుతర-శరముల-పాఁయఁగఁ జేతుఁ
పటుతర యురమును-చీలఁగఁ జేతుఁ
అటునిటుకదలక-పదములవిరుతుఁ ॥ఏపలువా॥

29 తోడిరాగము. ఏకతాళము,

కుశ॥ ఓరోరోరీ-నిలునిలుమిఁక పొగ-రడిచెదభూమిప రణమందుఁ
-శరంబునిటునిఁ-విరోధగతిచే-ధరఁ పడగనిఁ-
మదయింతుఁ ॥ఓరో॥

శతృఘ్ను॥ బాలా-మేలా

కుశ॥ పోరక-రారా

శతృఘ్ను॥ బాలోఁడ-వీలాగు-అలంబు-చేయంగ-చాలుదె
బాలక-పోలునేరా.

కుశ॥ ఇటులన్-పలుకన్-నగునే-పొగరే

శతృఘ్ను॥ వైరంబునీ-కేరాయికన్-పోరాడఁగా-ధీరుండనే
నీవు-శూరుండవే॥ ॥ఓరో॥

30 కల్యాణిరాగము. ఏకతాళము.

లవ॥ } సమరమందు-శౌర్యమున్-మీరన్-చూపుమా-ఓపుమా
కుశ॥ } సవనవాజినాజిలో-శక్తిచూపనినిత్తుము ॥సమర॥

31. కల్యాణిరాగము. ఆటతాళము.

లక్ష్మణ॥ బాపలేటికిమీకునీగతి- పవరమును చాలింపుఁడు
సైపలేరు ప్రతాపవహ్నిని-చటులబాణపరంపరల్ ॥బాప॥

32 కల్యాణిరాగము. ఏకతాళము.

లవ॥ } నృపులకెందుయుద్ధమే – సారా – మోక్షమా ధర్మమా
కుశ॥ } నృపుఁడక్షత్రియుండవు – నీకుఁ జెప్పువారమే ॥నృపుల॥

33 కల్యాణిరాగము. ఆటతాళము.

లక్ష్మణ॥ మీరుక్షత్రియులౌదురే – మిముఁ గన్నధన్యులికెవ్వరు
మిమ్ముగన్నయశమ్మునొందిన – మేలివంశము నేదొకో

34 కల్యాణిరాగము. ఏకతాళము.

లవ॥ } కులమునూరుపేరు నీ – కేలా – బంధువీవౌదువే
కుశ॥ } వినుముజన్మపత్రికల్ – వేడ్కవాయువాఁడవే ॥కులము॥

35. కల్యాణిరాగము. ఏకతాళము.

లక్ష్మణ॥ వీరక్షత్రియులైన శూరుని - బలమునిటుయోచింపుడు
తారతమ్యమెఱుంగకిట్టుల - మీరినిల్వఁగపాడియే ॥వీర॥

36. బిల్హారిరాగము. ఏకతాళము.

లక్ష్మణ॥ పుడమిపడగ -- వేయఁజాలనే

కుశ॥ పోగరా?

లక్ష్మణ॥ తగురా?

లవ॥ నగరా?

లక్ష్మణ॥ బాలులంచు నూరకుంటి

కుశ॥ ఏలగర్వమడరెనీకు

లక్ష్మణ॥ నిలుము నిలుము - పలుకులార్చెదన్

లవ॥ చనుమా

లక్ష్మణ॥ వినుమా

కుశ॥ కనుమా

లవ॥ } పలుకుతేల పసుపుబాణముల్ -
కుశ॥ } మెచ్చన్ - వచ్చున్ - నిన్నున్.

లక్ష్మణ॥ శరములింక నురముపెడలి ధరణిచేరుచూడరా

తరమెనిలువ - రణముసేయఁగా -

కలరా - మీరన్ - గలరా

37. హిం - జంఝూటి రాగము. ఏక తాళము.

లక్ష్మణ॥ వీరుఁడైన శక్తియున్న-యుద్ధమందుఁ బోరఁజాలి-నిల్వుమా
కుశ॥ బీర మేల బాలులంచు - పల్కనేల ధీరుఁడౌచు - పోరుమా
లక్ష్మణ॥ బాలురింతతో వైర మేల - కాలంబుతీరినదిగా
లవ॥ ఈలాగు ప్రేమంబునీ కేలనూ - చాలించి గై కొమ్ము -
బాణంబులన్
లక్ష్మణ॥ ప్రాణంబు-మానంగ-నౌనఁ చూడుఁడీ-మన-లేరు
చూడుఁడీ ॥వీరు॥

38. ఇంగ్లీషునోటు. ఏక తాళము.

ఆంజ॥ ఇదె ధరన్ బడన్ పడన్ నడంతునిం దె దుష్టులన్ -
ఖలులనొంతు - ద్రుంతుమింతు - వంతనొందఁజేసెదన్
ఏ - పా - రన్ - దైత్యులిట్టుకట్టడిన్ -
సలుపదలచి - కలతపరచి - ఖలత సలిపిరే ॥ఇదె॥

39. కల్యాణిరాగము. ఏక తాళము.

ఆంజ॥ నేనెందు కానన్నైతి - జానకిన్ కానన్నైతి -
దీనతనొందనాయె-ప్రాణంబు మానన్నాయె,
శ్రీరాము నెట్లుగాంతు - యేమని విన్నవింతు - ॥నేనెందు॥

40. ఇంగ్లీషునోటు. రూపక తాళము.

ఆంజ॥ వదుఁడిందూరక
శూర్ప॥ } విడుమమ్మూరక
కరా॥

ఆంజ॥ పాపాత్ములైతిరి.

కరా॥
శూర్ప॥ } తప్పులసైరింపు

ఆంజ॥ మొడనలిమొప మిమ్మింక

కరా॥
శూర్ప॥ } దయవిడువుము ప్రొమ్కెదము

ఆంజ॥ పలుకకుడోతులువల్

కరా॥
శూర్ప॥ } ఘనకరుణను మనుపుము. ॥పడు॥

41. శంకరాభరణరాగము. ఏకతాళము.

లవ॥ రామారామా – రఘువరరామా – రాఘవరామా
దానవభీమా – జగదభిరామా – తారకనామా –
దశరథరామా ॥రామా॥

42. శంకరాభరణరాగము. ఏకతాళము.

ప్రేమాధామా – ముఖజితసోమా – సురుచిరధామా
మునిజనధామా – వేదారామా – వైకుంఠధామా –
రామా రామా ॥రామా॥

43. బేహగ్ రాగము. ఆదితాళము.

కుశ॥ } జనకా–ప్రేమనిమ్మా–తనయుల మము చేకొమ్మా
లవ॥ } తండ్రిరోమాదగు–తప్పులసైచి–తనరగ - దయ
రానిమ్మా ॥జనకా॥

కోపముచేనిటు–పాపముఁజేసితి–కొమరుగ
మమ్ముఁజేకొమ్మా ॥జనకా॥

సీత॥ కరుణించి పా - లింపుమా - ఆలింపుమా - నాథా ॥కరు॥
ఎన్ను మ నీమది - మన్ననజేయవె - సన్నుత రఘుమణి
న్యాయమా - భారమా - ఉదారమా
గంభీరమా - నా - థా ॥కరు॥

45 పూరి కల్యాణి రాగము ఆటతాళము.

రామ॥ కామిని కరుణింపవె-కాంతగా నీకిటు
సంతాపము చేకూర్చితి ॥కామిని॥
జానకి యీకానల-పోనాడిన హీనుఁడనే
మానక కాపాడవె-సీత భూవిజాత యిటు ॥కామిని॥

46 మోహనరాగము. ఏకతాళము.

కమలా-నాథా-విమలవిభా-కమలా-వాసా-కలుష హరా
ప్రముదా-భాసా- వరఫలదా-కమలా-నాథా - ఘనకరుణా॥
కరివరదా-సురవినుతా - హరి వదనా-మురహరణా-సుర
చిర - నార-దాది-వంద-నీయ్యా-శ్రీ॥ కమలా॥
సామలోలా - సాధుపాలా- వేదలీలా - సారలీలా - భాను
జాలా-మంధరధారణ - మానివిభావన-కారణ సత్కరు
ణా-సు-బ్ర-హ్మ-ణ్యా-వందితా-॥కమలా॥

మంగళం



గోనుగుంట్ల ముద్రణాలయము, ౧౫, బ్రాడ్వే, మద్రాసు : ముద్రితము.